కలవర పెట్టినట్లయింది. ముడివేసిన జుట్టు చెవులమీద పడుతూ, గుండ్రని బుజాలమీద తెల్లని పమిట కప్పుకుని కొంచెం ముందుకు వొంగి, తదేక దృష్టిగా మహాకాశంలోకి చూస్తోంది? శేషయ్య ఏడీ? తనకి తెలీని యే ప్రబల వాంఛ ఆ కాముణ్ని పీడిస్తోంది? మరేదన్నా పిశాచం కాదుకద? ఆ తలపులతో కాముడిమీద మాతృప్రేమ పొంగింది లక్ష్మమ్మగారికి. పాపం కాముడు యేదో బాధలో, అవస్థలో వుంది. తను సహాయపడాలి. ప్రేమా, కరుణా చూపాలి. ఇందాకట్నించి యెంత అన్యాయంగా, విరోధంగా తలుచుకుంది దాని విషయం! వెళ్ళి కావిలించుకుని, కాముణ్ణి అడిగితే! ఇదిపరకటిమల్లేనే మొహం తిప్పేసి, వూరుకుంటుందేమో! తనకి ఆ విచారంలో బాధలో స్థలం లేకుండా చేస్తే! కాముడు? ఆ గాయం తను ఓర్చుకోలేదు. తన కూతురు తనని దూరంచేస్తే సహించలేదు. కాని పాపం, ఎంత బాధపడుతోందో! యెందుకు? ఒకవేళ కామం వల్లనేమో! నీచమైన తుచ్ఛమయిన పశుత్వంవల్లనేమో, స్త్రీకి అట్లా వుంటుందా! కాదు. ఆ శేషయ్యే యేదో చేస్తున్నాడు. దీని మనసుని విరిచాడు. పాడు చేశాడు. దురూహలు ప్రవేశపెట్టాడు. తనెంత గుడ్డిగా వీణ్ణి నమ్మి తీసుకొచ్చింది! వాడే! వాడే! పాపం, పాడి మాయలోపడి తన కూతురట్లా అయింది. అంతే! స్త్రీకి సహజంగా నిర్వ్యాజంగా ఇట్లాంటి పాడు వూహ పుట్టదు. ఇప్పుడేం చెయ్యాలి? ఎట్లా కాపాడ్డం కాముణ్ణి!....

....కాముడు కొంచెం ముందుకి వొంగింది. చేతులు కొంచెం ముందుకి కదిల్చింది. శేషయ్య కాముడి దగ్గిరిగా వొచ్చేప్పటికే లక్ష్మమ్మగారి శరీరంలో విద్యుల్లతలు పైనించి కిందికి వేగంతో పరుగులెత్తినట్లయింది. యెందుకు తనకీ ఆరాటం? యేమిటా తీవ్రమయిన చూపు కాముడి కళ్ళల్లో? తనెప్పుడూ అట్లా చూడలేదే. ఎవరినీ! ఆమె ఎందుకట్లా చూడడం! తను అట్లా చూస్తేమాత్రం తన భర్తకి అర్థమయేదా, దాని కర్థమేమిటి? మోహంతో స్త్రీ పురుషుడిపైపు పంపే సహజమయిన వాల్చూపులు కానీ, కామంతో నిండి బరువైన దీర్ఘదృష్టులు కానీ ఆమెకి తెలీవు.

శేషయ్య కాముడి దగ్గిరిగా నుంచున్నాడు. కాముడు అతని భుజం మీద నాలుగు వేళ్ళేసింది. లక్ష్మమ్మ వొళ్ళంతా ఝల్లుమన్నది. ఆమెమీదే

యెవరో చేతులు వేసినట్లంయిది. ఈ కొత్తభావమూ, రసనా, యేమిటివి? సహజమయిన యవ్వనభావోదయం అప్పటికి కలుగుతున్నట్లుందామెకి. శేషయ్య మెడచుట్టూ చేతులువేసి కాముడు అతనికేసి వాలింది. ఇంక చూడలేక లక్ష్మమ్మగారు కళ్ళు తిప్పుకుంది. లోకమంతా, ఒక వస్తువు నొకటి ఆకర్షిస్తున్నట్లయింది. తన హృదయాన్నెవరట్లా పిలుస్తున్నారు? యెవరు? యేమిటీ వెలితి? యేం కావాలి? అనుభవం అని కొంచెంగా స్ఫురించింది. తను ప్రేమించాలి. తను ఎవరినన్నా కావాలని కోరాలి. నరాలన్నీ కొత్తబాధతో లాగాయి. తలతిప్పేసుకుని చీకట్లో నడిచి రోడ్డుమీదికి వెళ్ళింది. నడిచి వెళ్ళిపోతోంది. తోవ సంగతి ఆలోచించకుండా, తన కేదో కావాలి. ఈ లోకమంతా వెతికైనా, తను కనుక్కోవాలి. ఆ చూపు, కాముడికళ్ళలో చూపుని, ఇప్పుడు తెలిసింది. తన భర్త కళ్ళలో చూసింది.

# 4

గత జీవితంలోంచి రెండు పటాలు కళ్ళముందు నిమిషంలో తిరిగాయి. తను కొత్తగా కాపరానికి వెళ్ళిన రోజుల్లో, ఒకరాత్రి లక్ష్మమ్మ పక్కమీద పడుకోగానే, మామూలు ప్రకారం భర్త ఆమెవేపు తిరగకపోతే నిద్రపోతున్నాడని, తనూ పడుకుని నిద్రపోయింది. కొంత సేపటికి అతను ఆమెచుట్టూ చెయ్యేసి లేపాడు. కళ్ళువిప్పి, సిగ్గుపడి, సంతోషంతో, కళ్ళు మూసుకుంది.

"నువ్వెప్పుడొచ్చావు?"

"అప్పుడేవొచ్చి నిద్రపోయినాను."

"మరి నన్ను లేపలేదేం?"

"మీరు నిద్రపోతున్నారు"

"లేపకూడదా?

అతనిచేతుల్లో కంఠంలో బాధ వినపడుతోంది.

"ఎందుకు?"

"నే నెందుకు లేపాను నిన్నిప్పుడు?"

ఏం చెపుతుంది?

మళ్ళీ అడిగాడు.

"మీకు నేను కావాలిగనక"

"మరి నేను నీకక్కర్లేదూ?"

యేం తమాషాప్రశ్న. ఆయన తనకి కావలసి రావడమేమిటి? ఆజ్ఞా పించడానికీ, అనుభవించడానికీ తను ఆయన కవసరం. కాని ఆయనని తను కోరడమేమిటి! తమాషాగా మాట్లాడుతున్నారు. నవ్వింది. ఆయన తనమీద ప్రేమచూపితే బావుంటుంది. నిజమే. కాని చూపకపోతే యేమీ లేదు. పగలంతా పనులతో సరిపుచ్చుకోటంలా, అట్లానే రాత్రులూ నిద్ర పోతుంది. తనకి కావలసి రావడమేమిటి!

ఇంకో రాత్రి!

"నన్నెప్పుడూ ముద్దుపెట్టుకోవేం? అన్నాడు.

పెట్టుకుంది.

"కాదు. నే నడక్కుండా"

"ఎందుకు!"

"ముద్దుపెట్టుకోవాలనిపించదూ?"

"ఊహూ"

"నేను బావుండనా?"

"బావుండరూ...."

"అయితే?"

"ఐతే ముద్దుపెట్టుకోడ మెందుకు?"

"నేను ముద్దుపెట్టుకుంటే నీకు బావుండదూ?"

"చాలా."

"మరి నువ్వు నన్ను ముద్దుపెట్టుకుంటే, నాకట్లా వుండదూ!'

"మీకు బావుంటుందా?"

"కాదు మరి...."

"సరే పెట్టుకుంటాలెండి. కాని మరిచిపోతాను."

# 5

యిట్లా తనకోసం, సహజంగా తనంతట తనకే ఉద్భవించే ప్రేమ కోసం విచారపడిపడిపోయినాడు గావును! పాపం యీ రాత్రి ఇక్కడడుంటే! అబ్బా! యేమిటీబాధ తనకి? యెవర్నన్నా కావిలించుకోవాలి. ప్రేమించాలి, ప్రేమించాలి తనవారుగా, తన హృదయాన్నంతా అర్పించి, తనని తనే మరిచిపోయి, రెండోవారై —యెవర్ని? యెక్కడ? యెట్లా? పురుషస్పర్శని తలుచుకున్నప్పుడల్లా ఆ భర్త రూపమే ఆమె ముందు నిలుచుంది. అతను తప్ప ఇంతవరకు పురుషుడామెకి లేడు. కాముడు శేషయ్యవంక యెట్లా దగ్గిరికి మెడని వంచుకుంది? యెట్లా తీసుకుంది? తను, తనుకూడా అట్లా" ఈ రాత్రి ఇప్పుడే-యేడీ అతను? ఆ జాలికళ్ళు, చిన్న మీసాలు, వుత్తరియ్యపువొంపు, మెడమీద ఆ చిన్నమచ్చ, ఏడీ! యెట్లా ప్రేమించకుండా వొదిలింది అతన్ని అన్నాళ్లు! యేమయింది తన హృదయం? తనే అతన్ని ఈవిధంగా కోరివుంటే, ఆ నాలుగు సంవత్సరాలూ, కలవలె, సుందర కాంతివలె, స్వర్గశయ్యవలె, యెట్లా, గడిచిపోయేవో! అతని కంఠశబ్దమే, అతని చిన్న చూపులే, కదిలే అతని పెదవులూ, మహావరాలుగా, యెట్లా గడిచిపోయేది జీవితం? చచ్చిపోయేవాడా? చచ్చిపోనిచ్చేదా? తనంత ప్రేమిస్తే. తననించి వెళ్ళేవాడా? భర్త రూపం పక్కన దిగులుగా నుంచున్నట్టు తోచింది. చేతుల్లోకి, పెదిమల దగ్గిరికి యెట్లా తీసుకోడం?

"నిజంగా నీమీద ప్రేమ కలిగింది, నువ్వు కావాలినాకు. నువ్వే అని యెట్లా చెప్పడం? యెన్నాళ్ళనించి మరిచిపోయింది అతన్ని?....

...రోడ్డుకి అడ్డంగా యెర్రని దీపాలుపెట్టి కర్రలు కట్టిఉన్నాయి. వెనక్కి తిరిగింది. ఇంటికి వెళ్ళాలా? ఎక్కడ ఇల్లు? ఏ వూళ్ళోవుంది తను? ఎట్లా ఆ సత్రం దగ్గిరికి పోవడం? అక్కడ వాళ్ళిద్దరూ! వెంటనే కాముడిపైన అనివార్యమైన సానుభూతి తోచింది. ఆమె అనుభవంపైని వాత్సల్యం కలిగింది. ఆమె చూపులు అర్ధమౌతున్నాయి. మెల్లిగా లక్ష్మమ్మ గారి జ్ఞానాకాశంలో మబ్బులు తొలిగిపోయి వెన్నెల బైటపడ్డది. కాముడి వాంఛ సహజంగా కనపడ్డది. కాని ఫరాఖ్ఖు మొగవాడితోనా? కాముడే

ఆ విధంగా కాముడి భర్త వేపు చూస్తే ఆ ఆనందాన్ని, రసోద్రేకాన్ని చూసి ఆశ్చర్యపడి సంతోషించి వుండును లక్ష్మమ్మగారు. కాని ఆ శేషయ్య వేపు! ఛీ! ఛీ! పాపం! ఘోర పాపం! తన వంశపు కీర్తి! తన పేరు! తన భర్త మర్యాద! ఛీ! ఛీ! తనేం చెయ్యాలి? తన కెందుకదంతా? కాని ఇంకెవ రున్నారు! తన విధే. ఆ తలపుతో ఆమె మనసులో నీరసం తోచింది. మీనాక్షి సన్నిధిలో భక్తితో కళ్లమూసుకో తలుచుకున్న తనకెందుకీ కష్ట మంతా? ఎందుకీ సమస్యలన్నీ? వాళ్ళిద్దర్నీ తనెట్లా విడతియ్యటం? విడదీస్తే కాముడు ఇట్లా తనవలెనే బాధతో—తన కూతురు వేపు ప్రేమ వెల్లి విరిసింది. పాపం, అంతకోర్కెతో యవ్వనంలో భర్తలేక వొంటరిగా యెట్లా భరి స్తుంది? ఏంచెయ్యాలి తను వాన్ని సంతుష్టిపరచడానికి? వెళ్ళి కావిలించుకుని.

"కాముడూ, నీ బాధ నాకర్థమౌతోంది. భయపడకు....ఆనం దంగా..." చప్పున ఆశ్చర్యంతో ఆగింది. తనే! ఈ పాడుపనిని వొప్పు కోడం! తనకే ఇట్లాంటి ఆలోచనలు! వాళ్ళిద్దరికి తుచ్ఛమయిన ఆ కామాన్ని వొప్పుకుని ఆ చర్యల్ని చూస్తో, దినదినమూ—వాళ్ళ ప్రేమ సంబంధాన్ని భరిస్తో.. వీల్లేదు. వాళ్ళమీద కోపం కలిగింది. అదేం పని.... సిగ్గులేక? పాపం! ఘోరపాపం! యెవరికన్నా తెలిస్తే తనవూరు వెళ్ళింతర వాత లక్ష్మమ్మ కూతురని వూరివాళ్ళందరూ! కాముడికి కడు పొస్తే? తల తిరిగింది. తనేం చెయ్యాలి? ఈ శేషయ్యని పంపెయ్యాలి. కాని వెడతాడా?ఆ చూపు, ఆ ఆకర్షణ... వాళ్ళిద్దరూ ఇప్పుడేంచేస్తున్నారో! ఇంకా దగ్గిరిగా జరిగి గదిలోకే వెళ్ళి—యెట్లా! తనకేది శరణ్యం? వెంటనే తానెవరినన్నా అట్లా గాఢంగా, తన ప్రేమశక్తి నంతటితోనూ....ఈ రాత్రే తనభర్త కావాలి. లేకపోతే తనే భర్త దగ్గిరికి వెళ్ళాలి. వెళ్ళి, దగ్గిరిగా, అబ్బా! తనో! తనకో! యేవరినన్నా తనూ అట్లానే...ఇప్పుడే, యీ రాత్రే మళ్ళీ భర్త జ్ఞాపకం వొచ్చాడు. అతను కావాలి.ఎట్లా యెట్లా? ఐనా తనే ఆ యాత్రచేసి, అతని పాదాలమీద వాలి, తన పశ్చాత్తాపం తెలియచేసి...వెళ్ళి పోవాలి. వెంటనే అతని దగ్గిరికివెళ్ళి, దగ్గిరిగా....గట్టిగా....అబ్బా! చేతులు జాచింది. ఆకాశంవేపు పుత్తచేతుల్ని శుష్కించిన తన రొమ్ము దగ్గిరిగా

లాక్కుని వొత్తుకుంది. ఒళ్ళు, తొడలు, రొమ్ము అన్నీ ముందుకు జరిపి నుంచుంది.

"నీమీదే...నీమీదే...నువ్వే...నిన్నే..." అంది బిగ్గరిగా. రహస్యం చెపుతున్నట్లు. అతన్ని తలుచుకుంటే ఇంకా పోయిన ఆనాటి పలె చిన్న వాడుగా కనబడ్డాడు మనసుకి తనభర్త కావాలి. ఎవరన్నా రుషి ఆ నిమిషాన....యెవరన్నా దేవత; మధురమీనాక్షి! భగవతి! ప్రేమజనని మీనాక్షి! ఆమె ఇవ్వదూ! సుందరేశ్వరుడూ మీనాక్షి! ఊరేగుతున్నారు. అదుగో మధుర సన్నాయి! పరిగెత్తింది ఆవేశంతో. భర్త భర్త కావాలి....

# 6

పూరేగింపు...తెల్లని మతాబు వెలుతురులోకి వెళ్ళింది. అదుగో మీనాక్షి! రత్నహారాలతో బనారసు కండువాల కింద వెలిగిపోతోంది. జగద్దంపతులు. తపస్సుచేసి, అగ్నిగుండంలో దూకి, పతిని తెచ్చుకుంది. "నా భర్త, భర్త నియ్యవూ? తల్లీ తల్లీ నామీద కరుణించి భర్తనియ్యవూ?'.... పరిగెత్తింది. భక్తీ ప్రేమా హృదయంలో పొంగిపోయినాయి. "తల్లీ, మీనాక్షి, నా భర్త...." జాజిపువ్వులూ, సాంబ్రాణి వాసనా, భక్తుల కీర్తనలూ, సన్నాయిపాటా, పరిగెత్తి రథంముందు నించుంది. 'తల్లీ వొచ్చాను నా ప్రార్థన విను. నా ప్రేమకి, నా మోహానికి నా భర్త. భక్తుల పాలిటి కల్పతరువూ! మీనాక్షీ, వొస్తున్నా నీ దగ్గిరికి!" యెగిరి నడిచే రథం మీద దూకింది; కాలుజారింది. మీనాక్షిపైన వేసిన పూలదండలూ, పుత్తరీయం పట్టుకుని వేళ్ళాడింది. వక్షంమీద అనుకున్న చేత్తో ఇంకా ఆ దండా వుత్తరీయం పట్టుకునే కిందపడ్డది. ఆమె నడుం మీదనించి రెండు చక్రాలూ పోయినాయి. ★

# ఆర్గ్యుమెంటు

‘య్రామయ్యా జడ్జిగారూ నాకు శిక్షవేసేముందు నేను చెప్పే సంగతులు యోచించుకోండి! నాకుమల్లేనే మీకూ నవరుచులున్నాయి; నామాదిరిదే మీశరీరమూ; రక్తమూ, మాంసమే-ఇనుముకాదు. నాలోనూ అందరిలోనూ వున్న ఆత్మే మీలోనూ ప్రకాశిస్తోంది. ఎంత రాయి చేసుకున్నా హృదయం మీలోనూ కొట్టుకుంటోంది. దోషాన్ని తూచిశిక్షలు తయారుచేసి నామొహాన పారేసే మెషినుకాదు కదా! మీరు వినండి — నేను చెప్పేదంతా విని, న్యాయమని తోస్తే విడిచిపెట్టండి. వొదలి పెట్టటానికి స్వతంత్రం లేదా? యీ ఉద్యోగం మానుకోండి ధైర్యం వుంటే. ధైర్యం లేక నిర్దోషిని శిక్షిస్తారా? కానీండి.

నేను నిర్దోషిని. దోషినన్నినాతో వాదించి రుజువుచెయ్యి. ఆ ప్లీడరుని వూరుకోమను. వాళ్ళకి నిజంతో పనిలేదు, ఫీజుతో తప్ప. నా నేరం నేనే ఒప్పుకుంటున్నాను. సాక్షులతో పనిలేదు; నీకు మెదడు వుంది. నాకూ వుంది ఇద్దరం కలిసి యోచిద్దాము.

అవును, బిడ్డ పుట్టకుండా నేను గర్భం తీసేసుకున్నాను. అదెట్లా నేరమో చెప్పు?

పుస్తకాల్లో తప్పని రాసివుంది; అలా తప్పనకు. పుస్తకాలు పురాతనాలు. ఆ రాసినవాళ్ళు దుర్మార్గులు. బుద్ధిహీనులు. వాళ్ళ మాట ప్రకా

రమే నడుస్తుంటే, మనకి వేరే మెదళ్ళెందుకు? తెలివెందుకు? పుస్త
కంలో అక్షరాలకి లొంగిపోతావా? నేను తిరగబడ్డాను. లోబడ్డావా, నువ్వు
నాకంటె పిరికివాడివి—స్వతంత్ర యోచనలేని వాడివి – దోషివి - నీకేం
అర్హత వుంటుంది నన్ను శిక్షించడానికి?

వినుమరి—నేను మొదట చేసింది తప్పంటావా? ఆ పనిచేస్తే శిక్ష
లేదు, మీ పుస్తకాల ప్రకారమే. ఆ పనే తప్పంటావా? అదీ నువ్వుచేస్తున్న
పనే. భర్తలేనిది చెయ్యడం తప్పంటావా? భర్తవుండి కడుపు వచ్చినా,
కడుపు తీసుకోడం నేరమేగా? అదిగాక కడుపురాకుండా ఏం చేసినా తప్పు
లేదూ? వొస్తే మొదటినించీ అంతా తప్పా! కడుపురావడం నా తప్పుకాదు
కద! పెళ్ళానికి పిల్లలు పుట్టకపోతే అది ఆమెదీ తప్పుగా చూసే మీరు,
నాకు కడుపురావడం తప్పంటారా? గర్భం కలిగిం తరవాత యెందుకు తీసే
సుకున్నావంటారు? నాకు అనేక కారణాలున్నాయి నన్ను పోషించేవాడు
వొదిలేస్తాడు ఎట్లా బతకను? నాకింకేమీ కష్టంపని చేసుకుని బతకడం చేత
కాదు. కూలి చేసుకోరాదా? వంట చేసుకోరాదా అని సులభంగా అంటారు.
అందమైన కూలిదాన్నిగాని, వంటదాన్నిగాని బతకనిస్తారా మొగాళ్ళు?
ఇక్కడ వున్న వాళ్ళందరూ అట్టాంటి మహానుభావులే కోట్లూ, తలగుడ్డలూ
పెట్టుకుని వెకిలి నవ్వులు కార్చుకుంటో, మీసాలు మెలేస్తో నావంక అతి
తీవ్రంగా చూస్తో కూచుంటే సరా? మీ సంగతి ఎవరికి తెలీదు? మొగాళ్ళు
బలవంతం చేస్తే నీ నీతి ఏమయిందంటావు? తమకి లోబడకపోతే తమ
పెళ్ళాలతో సాడీలు చెప్పి పనిలోంచి తీసేయిస్తారు. ముందు మొగుళ్ళ
మీదనే సాడీలు చెప్పితే మొగుళ్ళతో పోట్లాడినా, చివరికి ఆడవాళ్ళా నన్నే
పొమ్మంటారు మర్యాదగా! నేనూ బతకాలి, ఎందుకు లోబడ్డావని అందరూ
తిట్టేవాళ్ళే! మీ భార్యల్ని అట్లా గదుల్లో దాచుకోకండా, కానీ లేకండా, నాకు
మల్లే, వీథుల్లో పారెయ్యండి. వితంతువులుకాగానే ఏ బంధువుల ఇళ్ళల్లోనో
చాకిరీలకి చేర్తారే? అభిమానమున్నదాన్ని గనక ఆ నీచత్వంకన్న ఈ
స్వతంత్రమే నయమనుకున్నాను. స్వతంత్రంగా సంపాదించమనండి. ఓ
దమ్మిడి మీ భార్యల్ని, తెలుస్తుంది. ఆ కులుకు, ఆ పాతివ్రత్యం అన్నీ

యామవుతాయో! రెండు రోజులు యింట్లోంచివెళ్ళి బైటబతికి రమ్మందురూ తెలుస్తుంది సంగతి!

ఆ సంగతి పోనీండి. గర్భంరాగానే ఆయన నన్ను వదిలేశాడు అక లెక్కువయింది. ఒంట్లో బాగాలేదు. మందులు కావాలి. ఏం చెయ్యను? మీ గుమ్మాల్లోకి వస్తే తరుముతారు. అవునా? పతివ్రతలు మీ భార్యలు గుమ్మాలు కడుక్కుంటారు. మైలపడ్డామని నానీడ తాకినచోట పాణ్ణీలుచల్లి శుద్ధిచేస్తారు.

బిడ్డని కంటాననుకోండి. దాన్ని నువ్వు పెంచుతావయ్యా? పోనీ దాని పోషణకి కర్చు యిస్తావా? శరణాలయాలున్నాయి. కాని నీతియుక్తంగా కన్న పిల్లలని తల్లిదండ్రులు చస్తే తీసుకుంటారట ఆ శరణాలయాలు పెట్టినవాళ్ళు నీతియుక్తంగా పుట్టారేమో అసలు! వెధవ ముండా కొడుకని అందరూ యేడిపిస్తే ఎవరు ఓదారుస్తారు? నీ పిల్లలతో ఆడుకోనిస్తావా? నన్ను పోషించడమే మా ఆయనకి ఇంత కష్టంగా వుంది. రోజుకి మూడు సార్లు పొమ్మంటారు. నేనైతే మాడి చస్తాను. వాణ్ని ఎట్టా చంపుకోను? వాడిబాధ చూడలేక వాణ్ణి ఏ బావిలోనో తోసి నేనుపురకాలి. పేపర్లో చదువు తారు. ఒక స్త్రీ పిల్లాణ్ని చంపి తాను చచ్చిందని, దీనికేం పుట్టిందని తిట్టు కుంటారు. పేపరు మడిచి దీపమార్పి పడుకుంటారు.

మరి ఆ 'లా'ని యేర్పరచిన వాళ్ళు మీరో మీ తాతలో, నాకు వెలి రాకుండా నా బిడ్డకి అమర్యాద రాకుండా కాపాడతారా? ఆ సంగతి మీరేమీ తెలీదు. మీకు తెలిసినదల్లా నన్ను కైదులో పారెయ్యడమే.

అవును నాకు వేరుగతిలేక ఆ దిక్కుమాలిన పిల్లకి ప్రాణమిచ్చి ఏడిపించడానికి కాఠిన్యం తక్కువై, తల్లిని గనక యీ పని చేశాను. మీ అభ్యంతరమేమిటి?

మొదటిది—ప్రాణం తీశానన్నారు. అది నాలో భాగమా వేరే ప్రాణమా? నాలోభాగం అయితే దాన్ని తీసేసుకుంటే మీకేం? నాకో కురుపు లేస్తే కోసేసుకోనూ? నా చెయ్యి కోసేసుకుంటా మీకేం? వేరే ప్రాణమా?

నాదీ కాదా? అయితే నా లోపల దాన్నెవరు ప్రవేశించమన్నారు. నా అనుజ్ఞ లేంది? లోపల ప్రవేశించినన్ను బాధించమన్నదెవరు? మీ అనుజ్ఞ లేకుండా మీ యింటోకి ఎవరన్నావస్తే మీరేం చేస్తారు? అట్లానే నేనూ బైటికి తరిమేశాను. చస్తే నేనేం చెయ్యను? నేను రప్పించానా? లేదు. నాకు బిడ్డ పుట్టాలని యే మాత్రమూ లేదు. నాలోకి వచ్చి నా ఆరోగ్యం, నా సౌందర్యం చెడగొట్టి, నా మానం తీసేస్తే బాగానే వుందీ? నేనెందుకు దాన్ని కాపాడాలి? దాని కోసమా? అవును మీ కోసములాగే వుంది. మీ రందరూ దాన్నితిట్టి వెక్కిరించి మీ పతివ్రతల్ని మీ పిల్లల పవిత్రపు పుట కల్ని సమర్థించుకునేందుకు.

నా యిష్టం వచ్చిన మందు నేను మింగుతాను. దాన్ని చావమన్న దెవరు? మీ పొట్టలో పాములు చేర్తే అవి చావడానికి బాగానే మందులు తాగుతారే?

దాని కసలు ప్రాణమున్నదని మీకెట్లా తెలుసును? భూమిమీద పడందీ వూపిరన్నా పీలవదు. ప్రాణమున్నదని నీకేం తెలుసు? నువ్వెప్పు డన్నా కడుపుతో వున్నావా? జడ్జీ నీకేం తెలుసు? పుట్టిన బిడ్డ తిండిలేక మాడి చస్తే నీ ప్రాణం సుఖంగా వుంటుందా? నీ కళ్ళు చల్లగావుంటాయా? మరి ప్రాణం తీసిన వాళ్ళకి పురిశిక్ష కదా! అదివెయ్యరేం నాకు? అంటే పూర్తి ప్రాణం కాదన్నమాట. అరప్రాణం, పావు ప్రాణం వుంటుందా? అరఆత్మ పావు ఆత్మ వుంటాయా? నిండు ఆత్మలు మీకున్నాయా? వుంటే నన్నెందుకిట్లా యేడిపిస్తారు? మిమ్మల్ని చంపినా తప్పులేదు అయితే!

కోడి గుడ్డుకి ఎన్నోవంతు ప్రాణం? గొర్రెకి వాటికి ఆత్మ వుందా లేదా! అట్లా చూస్తావేం? నీకేం తెలుసునని కూచున్నావు నన్ను శిక్షిస్తా నంటో....

నా ఆరోగ్యం చెడిపోతుంటూరా? కాఫీ హోటల్లో చెడ తినే వారినీ, పసి భార్యలకోసం మందులు తినే ముసలివాళ్ళనీ దండించరేం? నలభై యేళ్ళకే మూలశంకలూ, అతి మూత్రాలూ తెచ్చుకుని జడ్జీలనిదండించరేం?

దిక్కుమాలినదాన్ని నేను దొరికానా? నా ఆరోగ్యం పోతే ఎవడికేం? నా ప్రాణంపోతే ఎవడికేం? దుర్మార్గంలోపడి యెట్లా చచ్చిందోనని నన్ను చూసుకు సంతోషంతో కడుపు నింపుకుంటారు మీ భార్యలు.

దీన్ని చంపినందుకు లోకంలో మనుషులు తక్కువవుతా రంటారా మీరందరూ? పుణ్యాత్ములు మీరున్నారు చాలదూ? కనకుండా వున్న ప్రతి ఆడదాన్నీ శిక్షించండి, వితంతువుల్నందర్నీ కనిపించండి బలవంతగా!

మీ జనసంఖ్య పెరగడానికి యింకో జీవాన్ని నన్ను మోయ మన డానికి మీరెవరు? సృష్టి సాగదంటారా? నాకేం? నీకు సృష్టి సాగిస్తానని పూచీకత్తు నిచ్చానా? అసలు నన్ను కనవద్దని సంఘం ఆజ్ఞాపించిందిగా. 'లా' కనమంటోంది. కంటే సంఘం, కనకపోతే 'లా' శిక్షిస్తాయి. మరి సంఘమేగా 'లా'ని ఏర్పరిచింది.

సృష్టి నాలో యింకోజీవాన్ని పెట్టింది. దాన్ని తీసుకునే శక్తిని యిచ్చింది. మధ్య మీ కెందుకు?

ఏమంటావు, నన్ను వొదులుతావా? నీ వుద్యోగం పోతుందని భయమా? నీ వుద్యోగం కోసం నన్ను నిర్దోషిని శిక్షిస్తావా? ఇదేనా నీతి, యిదేనా పుణ్యం, చెప్పు జవాబు?

★

# లక్ష్మి వుత్తరం

ఇంక మీ మొహాన్ని యీ జన్మానికి చూడననుకుంటే: మీరు మన సల్లాపాలూ, ప్రేమా, అన్నీ మరిచిపోతారనుకుంటే, కొద్దిరోజుల్లో మళ్ళీ పెళ్ళి చేసుకుని, నన్ను పిలిచిన ముద్దుపేర్లన్నిటితోనూ ఇంకెవర్నో పిలిచి, నా బుగ్గమీద వేళ్ళేసేట్టే అట్లానే దానిబుగ్గమీద వేసి లాలిస్తారనుకుంటే: యెంతో బాధ కలుగుతుంది. వారంరోజులనుంచి ఆలోచించుకుని ఆలోచించుకుని యీబాధంతా రాత్రింబవళ్ళు మనసులో అనుభవించి ఆలోచించి చివరికి తప్పనిసరిగా మీకు రాస్తున్నాను.

నేను యీరాత్రి చచ్చిపోవడానికి నిశ్చయించుకున్నాను. మీకోసం, నాకోసం, అందరి క్షేమంకోసం ఆలోచించే నిశ్చయించుకున్నాను. నాకోసం అట్టే దుఃఖించకండి. ఈ వుత్తరమంతా చదివినప్పుడు, నాచావు మీకుకొంత శాంతినికూడాకలిగిస్తుందేమో! కాని జాలన్నాపడరూ?పడతారా మీ హృదయం నాకు తెలుసు. నాకు తెలీకపోతే యింకెవరికి తెలుస్తుంది? నా ప్రేమని మాత్రం-నిశ్చలమైన నా ప్రేమనిమాత్రం-సందేహించకండి. అది నేను సహించలేను. సందేహించలేదని మీరు వుత్తరం రాసి, నన్ను ఆపుతారని భయం. మీ ధర్మం అనుకుని ఆపుతారు. కాని, జాలిపడి క్షమించానంటారు,

గాని, మీరు భరించలేరని నాకు తెలుసు. మీ హృదయం నాకు తెలీదూ? తరువాత మనిద్దరి జీవితం దుర్భరమౌతుంది. నాకే మీమీద అంత ప్రేమ లేకపోతే, మీకే నామీద అంత కాంక్ష లేకపోతే లోకంలో అందరిమల్లే వుంటే మనమున్నూ—యెట్లాగో కాపరంచేసే వాళ్ళమే....యీ పని జరిగింతరవాతకూడా....కాని అంత గాఢమైన నిర్మలమైన ప్రేమలో కొంచెం అనృతదోషం, కొంచెం అపవిత్రదోషం, అనుమానదోషం తగిలినా అంతా విషంగా పరిణమిస్తుంది. వీల్లేదు. చావుతోనే పరిహారం చెయ్యాలి. ఈ అక్రమాన్ని. విధి మిమ్మల్నీ, నన్నూ, మన ప్రేమనీ మింగి, నాశనంచేసి... ఇద్దర్నీ ఆరుసంవత్సరాలు, సుందరమైన సంవత్సరాలు, కలిపి మధుర బంధనాలతో కట్టి, యేకంచేసి, క్రూరంగా నవ్వుతో, హృదయం లేకండా ఒక్కనిమిషంలో చీల్చి, విడతీసి, చెరోమూలా ఈ అనంత ప్రపంచ వైశాల్యంలో యెక్కడో—యింక ఒకరికి ఒకరం అందకండా—యెంత యేడ్చినా, యెంత చేతులు జాచి వెతికినా లాభంలేకండా—పారేస్తోంది!.... రేపెక్కడ కళ్ళు తెరుస్తానో!....ఒకవేళ నా ఆత్మ మీ దగ్గిరికి రాగలిగితే వొచ్చినట్లు మీకు తెలియజేయగలిగితే, ఈ వుత్తరం చదివేప్పుడు మీ దగ్గిర వుండగలిగితే....మీ విచారం చూడగలనా? నేను దగ్గిరే వున్నానని తెలప గలనా?....

నా ప్రేమని మీరు సందేహించవద్దు. మీ దగ్గిరికివొచ్చి, ఒక్కసారి, ఒక్క నిముషం, నా ప్రేమతో, కన్నీళ్ళతో, ప్రమాణాలతో నా హృదయ మంతా మీదేనని, నాదేహం మలినమైనా, నా ప్రేమ నిర్మలమని తెలియ చేయాలని యెంతోవుంది. ఒక్కసారి మళ్ళీ మీ నవ్వే మొహాన్ని చూడా లని, నావేపు కొంటెగా, మోహంతో చూసే మీ చూపు ననుభవించాలని, ప్రేమతో ఒక్కసారి పిలిపించుకోవాలని వుంది. యెట్లా? నిజమండీ. ఒక్క నిమిషం కలలోనన్నా, మనసులోనన్నా ఇంకెవరినీ కోరలేదు. యెప్పుడూ- మొదట నన్ను మీరు చూడ్డానికి వొచ్చిన నాటినించీ కూడా-నా ఆలోచనలు-

కోర్కెలు అన్నీ మీమీదనే. మీరు నమ్మరూ? చచ్చిపోతున్నాగా!— యిప్పుడు నిజం చెప్పడానికింకేం? అవాళ సుబ్బారావు విషయమై, మీరు అనుమానపడ్డారుకదూ? నిర్మలమైన మీ కళ్ళలో ఆ స్వల్ప మాలిన్యమే చెప్పింది నాకు. కాని మీరు వొప్పుకోలేదు. నిజమండీ, ఆ సుబ్బారావు నాకేం లెఖ్ఖ! అందమైనవాడని తెలుసు. అందమైన వాణ్నని అతనికి తెలిసి, స్త్రీలందరూ తనని వొలిచి వొళ్ళోపడతారన్నట్టు చూస్తాడు. నావంకా అట్లానే చూశాడు. మీరంత ఆప్యాయంగా అతని పరిచయం నాకుచేస్తే అట్లాంటి భావంతో అతనుచూస్తే నాకెంతో దోకొచ్చింది? మీరు నమ్మరు కాదు, అతను ఆ వెంకటాచలంగారి కథ చదువుతోవుంటే, ఆ కథలో ప్రేమ, నా ప్రేమవలెవుంటే జ్ఞాపకంలేదూ—మెడకింద చెయ్యేసి ముఖం పైకెత్తడం మనమల్లేనే! ఇంకా పోనీండి ఇప్పుడెందుకు?—అందుకని శ్రద్ధతో కళ్ళతనిమీదనే పెట్టుకుని వినివుంటాను. కాని ఆ సుబ్బారావుమీద మనసనుకున్నారు నాకు! ఇప్పుడన్నా నమ్ముతారా?....యెన్నో అనుకున్నాను. మీకు ప్రమోషన్ కాగానే, మనం ఆ చిన్న డాబాయిల్లు అద్దెకి తీసుకోడం, వీధివేపు గదిలో మన మంచమూ, అద్దమూ, పెట్టుకోడమూ, రాత్రి మీరు క్లబ్బునించి వొచ్చేప్పటికి నేను....ఎందుకులెండి అవన్నీ! నాకోసం అట్టే యేడవకండి.

ఆ రాత్రి మీరు రెండునెల్ల కిందట నన్ను వొదిలి బైటికి వెళ్ళారు. ఆ రాత్రి జ్ఞాపకముందా? అంతకుముందు ప్రతివారమూ మీరు వొస్తారు వొస్తారని యెదురుచూసి చూసి నిరాశచెందివున్నాను. చివరికి అనుకోకండా ఆరోజు మధ్యాహ్నంవొచ్చి, ఆరాత్రే మెయిలికివెడతానన్నారు. మీ మొహం చూస్తోవుండే సంతోషమంతా, మిమ్మల్ని మళ్ళీ నెలరోజులు వదలాలనే దుఃఖంలో కలిసి మాయమైపోయింది, బాధతో లాక్కుపోయే గుండెల దడదడని అణచుకుని, మీకు పెదిమలమీద నవ్వునే కనపరిచాను.

అలిసి వొచ్చినమీరు రాత్రి మంచంమీద పడుకోగానే నిద్రపోయినారు. ఎన్నిసార్లో తలుచుకుని తలుచుకుని ఉవ్విళ్ళూరిన మీ సాన్నిధ్యాన్ని ప్రత్యక్షంగా కావిలించుకుని మహదానందంతో. మీ బుజంమీద తలపెట్టుకుని కళ్ళు మూసుకున్నాను. రాత్రంతా మీ ముఖాన్నీ. మీ పెద్ద కనుబొమ్మల్నీ, పల్చని చొక్కాకింద మీ గట్టిబుజాన్నీ సన్నని దీపపు వెలుగులో చూస్తో పడుకున్నాను. అలారం గడియారం నిమిషాల్ని వొక్కటొకటే చప్పుడు చేస్తోంది. దాన్ని విసిరి పగలకొడితే!....కాని పాపం పొద్దున్నే మీ మొహంలో వుద్యోగం భయాన్ని చూడగలనా?....మీ బుజంమీద నల్లి పాకింది. దాన్ని కూడా ప్రేమించా నారాత్రి. అదికూడా మిమ్మల్ని ప్రేమించి వొచ్చినట్టే కనపడ్డది. అట్లానే ప్రేమభారంతో కళ్ళుమూసుకుని మీ బుజంమీదే నిద్రపోయినాను. నిద్రపోతున్నా రెండుగంటలైనట్టూ, మీరు లేచి వెళ్ళిపోతున్నట్టూ, నాకు కలవచ్చి చప్పున లేచాను. కాని మీ చక్కని దేహం నా చేతులకింద పడుకునేవుంది. మెల్లిగా లేచి గడియారంలోకి చూస్తే వొంటిగంటయింది. యింకా ఒకగంట. మిమ్మల్ని గట్టిగా ముద్దుపెట్టుకుంటే, మీ రొమ్ముమీద నా తలని అదుముకుంటే, మీకు మెళకువ వొచ్చి, అప్పుడే ప్రయాణానికి సిద్ధమౌతారని భయం—కదలకుండా మీ గుండ్రని గడ్డంకేసి కోల చెంపలకేసి నున్ననిగోళ్ళలో కొనలుతేలే వేళ్ళకేసి, చూస్తున్నాను. మళ్ళీ కునుకుపట్టడమూ, అలారం కొడుతున్న చప్పుడైనట్టే మెళకువ రావడమూ మిమ్మల్ని చిన్న చిన్న తేలిక ముద్దులు పెట్టుకోడమూ, గడియారం వంక చూడడముతో గడిచింది ఆ కాస్త కాలమూ. టంగ్ టంగ్మన్నట్లు అనుకుని అనుకుని, భయపడి గుండెలు దడదడ కొట్టుకున్నాయి. ఆ బాధ భరించలేక మిమ్మల్ని లేపి పంపెయ్యాలనిపించింది.

నిద్రకళ్ళతో నన్ను కడసారి చూసి వెళ్ళిపోయినారు. బండి వెడుతో వుంటే నేనుకూడా మీతో వొస్తోవుంటే యెంత బావుండేది అనుకుని ఆశ

పడ్డాను. కిటికీలోంచి తొంగిచూశాను. దీపం వెలుతురులో మీకాలు చివర మాత్రం కనపడ్డది. అదే ఆఖరుసారి మిమ్మల్ని చూడడం మన జన్మానికి. మీనించి విరహం భరించలేక, మీరు పడుకున్నచోటే, కొంచం సిగరెట్టు వాసనవేసే ఆ పక్కమీద. మీవంక తిరిగి మీరున్నట్టుగా భావించుకుంటో పడుకున్నాను. మీరున్నట్టే అయింది, మీ చేతులు నా చుట్టూ వున్నట్టే, మిమ్మల్ని అనుకున్నట్టే అనుకున్నాను....

యెంత సేపయిందో. కలలో మీరు తిరిగివచ్చి నన్ను ముద్దు పెట్టుకున్నట్లు తోచింది. మెళకువ వచ్చింది. కొంచెంగా నన్ను కావిలించుకుని యెదురుగా వున్నారనుకున్నాను. యింకా కలా! ఆనందంతో సుఖానుభయంలో, నా దేహం మూర్ఛపోతోంది. యెంతో శాంతి వొచ్చింది నా నరాలకి.

"మళ్ళీ వొచ్చారేం?"

మాట్టాడలేను. ప్రేమతో నా చేతులు మెడచుట్టూ వేసి దగ్గిరికి యింకా అదుముకున్నాను. చంపలమీద చేతులు వేశాను? మీసాలు లేవు. యెవరిది? వొదిలించుకోబోయినాను. పెనుగులాడాలనుకున్నాను. కాని నా నరాలు నాకెదురు తిరిగాయి. నా శరీరమే నాకే తిరగబడి ద్రోహం చేసింది. మీరు మోహంతో నన్ను ప్రేరేపించేసి, తృప్తిపరచక, వొదిలిన నిరాశవల్ల నాదేహం యెంత ప్రయత్నించినా కదలలేను. స్వాధీనం తప్పింది. నా భర్త! నా ప్రేమ! అంటాను, అరుచుకుంటాను. మూడు నెల్లనించి మిమ్మల్ని తలుచుకుంటో అణచిపెట్టిన మోహతీవ్రత, మీరా రాత్రి సంతృప్తిపరచని ఆవేదన, అంతా నన్ను ముంచేసి, దాసురాల్నిచేసి, నా నిశ్చయశక్తిని నోరు నొక్కి నన్నిట్లాచేసింది...........వాడు, మీ పరమాప్తు....పోనీలెండి, వాడెవరైతేనేం? యెందుకు?

ఆరోజునించి జాగ్రత్తగా వున్నాను, తలుపు గడియ వేసుకుంటున్నాను. వెంటనే మీ దగ్గిరికి వొచ్చి మీతో అంతా చెప్పేసి, మీ కాళ్ళమీద పడి యేడిస్తే, మీరు కరుణిస్తారేమోనని ఆశపుట్టింది. మీ దగ్గరికి వస్తానని కూడా రాశాను, జ్ఞాపకముందీ? కాని వూరినించి వూరికి తిరుగుతో మీరు పిల్లేదన్నారు. మీకీ సంగతి రాయాలా కూడదా అని సందేహం పట్టుకుంది. చెపితే నన్ను వొదిలేస్తారా? అప్పుడు నేనెట్లా బతకను? అనుకున్నాను. అందుకనే మీకు రాశాను కూడాను. జ్ఞాపకముందీ? "ఒకావిడ యింకోడితో సంబంధం పెట్టుకుని తరవాత పశ్చాత్తాపపడ్డదీ. భర్త వొదిలెయ్యాలా; కూడదా! యేది ధర్మం? మీ అభిప్రాయమేమిటి?" అని. మీ జవాబు చదివితే మీరు క్షమార్పణ చూపేటట్టు కనబడలేదు. మీరు విపరీతమైన బాధపడతారని తెలుసు. తెలిస్తే! మీరు నన్ను వొంటిమీద ముద్దుపెట్టుకుంటో "యిదంతా నాదేకదూ! ఇంకోరు తాకితే భరించలేను!" అన్నప్పటి ఈర్ష్యతో నిండిన మీ చూపులు జ్ఞాపకమొచ్చాయి. ఆలోచించి, ఆలోచించి, మీతో చెప్పకూడదనుకున్నాను. "యెందుకు చెప్పడం? యేం లాభం చెప్పి? ఇంక మూణ్ణెల్లలో యిద్దరం ఎప్పుడూ కలిసే వుంటాం. మీకు ప్రమోషన్ కాగానే! యింక వాడేమి చేస్తాడు? అనుకున్నాను. కాని నా అదృష్టం యిట్టా పరిణమించింది. నా ఆశలన్నీ సంతోషమంతా యిట్లా బుగ్గిలో కలిశాయి. నెలరోజుల కిందటే మొదటి అనుమానం కలిగిందీ. నిజమేనేమో అని భయంలో గిజగిజలాడాను. యేదో వొకటి తేలిందాకా రోజురోజు యెట్లా గడిపానని! ప్రతిరోజూ యెదురుచూస్తో, తప్పు లెక్క పెట్టానేమోనని కొన్నాళ్ళు, ఆలస్యానికి కారణం కల్పించుకుంటో కొన్నాళ్లూ ఆశలేని ఆశతో గడిపాను. కాని మెల్లిగా స్థిరపడ్డదీ. ఇంక మీతో బొంకేదెట్లా? యెన్నడూలేనిదీ ఇప్పుడే యిదీ రావాలీ? పోనీ యెట్లానన్నా మిమ్మల్ని మోసపుచ్చి మీతోవుండే విధమే వుండకూడదూ?

మా వాళ్ళకి తెలిసింది. మీకు సంతోషంగా వుత్తరం రాశారు ఈ రోజు. ఆ వుత్తరం తరవాత ఇది అందితే మీ మనసు యెట్లా వుంటుంది? ఈపాటికే నన్ను సందేహిస్తో వుంటారు మీరు. ఈ వుత్తరం అందేటప్పటికే! పోనీ బతికేవుందామా అనుకుంటా! చచ్చిపోతున్నాను గనక నేను రాసిన యీ సంగతులు నమ్ముతారేమో గాని, బతికివుండి మీతో చెప్పితే నమ్ముతారా? నేనేదో కావలసి చేసి, యీ పన్నాగం పన్నాననుకుంటారు. వీల్లేదు. నీళ్ళల్లోపడతా నీరాత్రే. శెలవుమరి. ఇంక మళ్ళీ మీ మొహం చూడను. వొచ్చే జన్మంలో మీరెవరో, నేనెవరో! యీ చివర నిమిషాలలో మీతో గడిపిన అదృష్టపు దినాలూ, అమూల్య కాలమూ అంతా జ్ఞాపకమొస్తోంది, ఆరోజు తెల్లారకట్ట వొద్దులెండి. యెందుకదంతా ఇప్పుడు?- మళ్ళీ పెళ్ళి చేసుకుంటారా?....

★

# ఏతంతువు

చలికాలం. ఈ వూళ్ళో అదేమోకాని చలి ఎక్కువ. మంగమ్మ నా శాలువా కప్పుకుని నిద్రపోతోందనుకుంటా, మొగుణ్ణి వెచ్చగా కావి లించుకుని. నాకు ఇక్కడ చలి. నిద్రరాదు, కప్పుకోడానికా యేమీ లేదు. ఈ వెచ్చనిపొయ్యి దగ్గర కూచుంటే కొంచం వొణుకు నయం. కాని నేల ఇంకా ఆరలేదు—యెక్కడో ఇంకా చలిదేశాలు వుంటాయట. అక్కడెట్లా వుంటుందో?—చిన్నప్పుడు నాన్న 'సిండరిల్లా' కథ చెప్పేవాడు. అట్లా వుంది నా స్థితి యిప్పుడు. ఐతే సిండరిల్లా చిన్నపిల్ల .... నాన్న బతికి వున్నప్పుడు ఎంత బావుండేది. కష్టమంటే తెలీదు. ఎవరన్నా దిగులుగాకన పడితే ఆశ్చర్యంగా వుండేది. నాన్న ఇప్పుడు నన్ను యీ అర్ధరాత్రి ఈ పొయ్యిదగ్గర వొంటరిగా కూచోడం చూస్తే? యెంత యేడుస్తాడో? ఎన్న డన్నా నేనిట్లా అనాథనై పోతానని అనుకుని వుంటాడా?. వొళ్ళో నన్ను కూచోబెట్టుకుని నా తల దువ్వుతో, చంపలు తాకుతో, "మా అమ్మ అంత అందమయిందీ లేదు. మా అమ్మనికింద కాలుపెట్టనీని మొగుణ్ణితీసుకొస్తా" అనేవాడు. అప్పుడు ఈ వెంకట్రావుగారూ, వాళ్ళూ నన్ను వొళ్ళల్లో కూచో పెట్టుకుని మిఠాయి పొట్లాలిచ్చి నా నోట్లోంచి చిన్నపాట వొస్తే చాలు, ఆహా ఆహా అని ఒకటే ఆనందించేవాళ్ళు. పదేళ్ళు కాలేదు. ఇంకా మొన్న

అన్నయ్యతో మాట్లాడుతో ఆయనే ఆ వెంకట్రావుగారే మొహం తిప్పే శాడు నన్ను చూసి.

అదుగో-పిల్ల లేచి ఏడుస్తోంది. మంగమ్మ లేవదేం? నేనై తే అట్లా ఏడవనిస్తానా? పొద్దస్తమానం ముద్దాడుతుంది పిల్లని. ప్రేమ లేకపోలేదు. అదుగో లేచింది మంగమ్మ—పిల్లని కొట్టింది- ఏడుస్తోంది పిల్ల. పిల్లల్ని కొట్టడానికి వీళ్ళకి చేతులెట్లా వొస్తాయో? సాయంత్రమేగా అట్లా ముద్దెట్టు కుంది. ఆ నోటితోనేగా ఆ తిట్లన్నీ—నాకే బిడ్డ వుంటేనా తెల్లార్లూ నా చేతుల్లో ఎత్తుకుని వూయిస్తో, ఒక్క నిమిషం రెప్పవాల్చక జోల పాడతా. ఇట్లా చేతుల్లో నున్నని, మెత్తని వెచ్చని అబ్బాయిని పట్టుకుని రొమ్ము నోట్లోపెట్టి అదుముకుంటే.. ఎంత బావుంటుంది! అందులో నా రొమ్ములు ఇంత గుండ్రంగా, చిన్నగా, నున్నగా వుంటాయి. అబ్బాయి చిన్న లేత గులాబీచేతులు యెంత బావుంటాయో—ఇప్పుడీ మనోవేదనతో నిద్ర రావడంలేదు గాని, అప్పుడా పరమానందంలో రాదు....అదుగో పోలీసు వాళ్ళు గావును ఆ యీలలు, ఈ వీధికే వొస్తున్నారు. వీళ్ళేట కన్నాలు వేయించేది. ఎందుకో ఊరికె అట్లా వూత్తారు? దొంగలుభయపడ్డానికేమో...

మంగమ్మకి పిల్లవుంది. కొట్టే మంగమ్మకి, చీదరించుకునే మంగ మ్మకి. ఆ పిల్ల యేడుస్తూనేవుంది. యేం? పిల్లకి పాలివ్వాలని వుండదూ? ఆ చిన్న తడుముకునే నోటికి, పిల్లి గావును! ఉష్ పో—నాకు పిల్లలుండ కూడదూ? ఆయన బతికి వుంటేనా, నాకీపాటికి ముగ్గురు నలుగురు పిల్ల లుండేవాళ్ళే, నేను గొడ్రాల్నయ్యేదాన్ని కాదు. బిడ్డల సంగతి తలుచుకుం టేనే నా కడుపులో ఇట్లా కలియబెట్టినట్లుందేనాకు పిల్లలుండకపోయేవాళ్ళా! చీదరించుకునే ఇట్లాంటివాళ్ళకే వుండగా లేంది? మొన్నవాడు జుట్టుపీకితే ఎందుకు పుట్టావురా వెధవా అంది మంగమ్మ. ఇంకోసారి "చచ్చావన్నా

కాదు, పీడ వదిలిపోను" అంది. నా జుట్టు అట్లాంటి చిన్న చేతులతో ప్రతి వెంట్రుకా నెత్తురు కారేటట్టు పీకించుకుంటాను.

ఆ మంగలాడు గొరగడం కంటె నయం కాదూ? — — — నా వెంట్రుకలు తీసేస్తారుట. తీసెయ్యనీ. చీదర వొదులుతుంది. వుండి యెవరి కని? గొరిగేటప్పుడు మంట పుడుతుంది గావును· మరి మొగాళ్ళు ఏడవరే? మంటవుండదు. కాని గొరగడం తలుచుకుంటే యిప్పుడే భయం పుడుతోంది. భయమేకాదు—గొరిగేప్పుడు మంగలాడు మెడమీద చెయ్యేస్తాడు గావును! మొన్న అన్నయ్యమీద చెయ్యివేశాడు. వొళ్ళు ఝల్లుమనదూ? పెళ్ళిలో తాళి కట్టేప్పుడు ఆయన చిటికెనవేలు తగిలేప్పటికే వొళ్ళు పులకరించింది. మీద చన్నీళ్ళ పోసుకున్నట్టు... మొన్న లక్ష్మీకాంతం తాళపుచెవిలిస్తో అజాగ్రత్తగా అతనివేళ్ళు నా చేతికి తాకనిచ్చేటప్పటికి అన్నయ్య కళ్ళెర్రచేశాడు. అదివరకు నేనేమీ అనుకోలేదు కాని, అన్నయ్య పడే అనుమానాన్ని చూసి, నాకు లక్ష్మీకాంతమంటే సరదా పుట్టింది...నన్ను తనయింటో పెట్టుకున్న కాలాగ్నిమల్లే చూస్తాడనుకుంటా అన్నయ్య. లక్ష్మీకాంతాన్ని చూసి కళ్ళెర్రచేశాడు. కాని మంగలాడు నా మెడమీద చెయ్యేస్తే యేమంటాడో అన్నయ్య?

ఈ పిల్లి బాగా మరిగింది పాలు తాగడం. ఈవాళ పాలు అందడం లేదు. గోలపెడుతోంది. ఆకలి, దానికి. పాపం నాకుమల్లేనే నిద్ర పట్టదు. పోనీ యెలికల్ని పట్టరాదూ?.., నా శాలువ కప్పుకొని మొగుడి పక్కన మంగమ్మ నిద్రపోతున్నట్టుంది మళ్ళీ. తెల్లార్లూ ఆ గదిలో ఏం చేస్తారో తలుపులు మూసుకుని? ఆయనే బతికి వుంటే నేనేం చేస్తో వుండేదాన్ని? నన్నిట్లా పొయ్యి దగ్గర కూచోనిచ్చేవాడా! చిన్నవాడే! ఎట్లా ఆ రోగం వచ్చిందో కాని? కార్యమయినా అయితే బావుండేది. అంతా తెలిసేది. ఏం చేస్తారో తెలుసు. కాని ఎట్లా చేస్తారో, అప్పుడు వొళ్ళు ఎట్లా వుంటుందో

తెలియాలని వుంది. కొందరు ఏడుస్తారు, ఎవర్నన్నా అడగాలని వుంటుంది. సిగ్గు, భయం, చెప్పరనుకుంటా. వాళ్ళకీ సిగ్గే. అప్పుడు సిగ్గు వుండదేమో! మాట్లాడ్డం మాత్రం సిగ్గు. నీకెందుకంటారు! ఒకవేళ ఒక బిడ్డకూడా వుండేదేమో? ఆయన కళ్ళు బావుండేవి. అకళ్ళేవొచ్చేవి అబ్బాయికి. నాచిన్న ఎర్రనినోరు వొచ్చేది. ఎంత బావుండేవాడని! అప్పుడు యీ వొదిన్ని యామైనా లెఖ్కచేసేదాన్నా మా నాన్న యిచ్చిన శాలుప లాక్కొని మంగమ్మ కియ్యనిచ్చేదాన్నా! అబ్బాయికి కావాలనే దాన్ని. ఇప్పుడు తెల్లారకట్టే లేచి మంగమ్మ కొడుక్కి వేణ్ణీళ్ల కాచాలంటే ఎంతో కష్టంగా వుంటుంది. అప్పుడు నా బాబుకోసం యెన్ని నీళ్ళన్నా సంతోషంతో కాచేదాన్ని కదూ! ఇప్పుడైనా పుట్ట కూడదూ! మొగాడు లేకుండా కనే పద్ధతిలేదూ? చెట్లకి కాయలు కాయటంలా? పోనీ ఒకబ్బాయి యెక్కడైనా దొరికితే బావుండును! అట్లా కాదు. కాదు. నాలోంచే రావాలి. నా అబ్బాయికోసం.... అట్లాకాకపోతే మంగమ్మ కొడుకుమీద నాకు ప్రేమ వుండకూడదూ?....నిద్ర వొస్తోంది. కొంచెంగా పడుకుంటే రాదు మళ్ళీ చలి.

నా ఖర్మంట! ఏదో పాపం చేశాను. పూర్వజన్మంలో ఎవరి పిల్లల్నో చంపా ననుకుంటా. వొచ్చే జన్మలోనైనా పిల్లలుంటారేమో! వొచ్చే జన్మంలో పిల్లలుండడానికి ఇప్పుడేం చెయ్యాలో? శాస్త్రుల్ల గారిని అడగనా! వొదినకి తెలిస్తే యింకేమన్నా వుందా? పిల్లలుండాలనుకోటం తప్పా! పోనీ వొచ్చే జన్మంలో వుండాలనుకోడమూ తప్పే ఆ ముసలి ముత్తైదయాభై ఏళ్ళది. వున్న కొడుకుని, అపుపత్యం చేయించి చేతులార చంపకుంది. ఆమె వొచ్చి పిల్లలులేరని ఏడిస్తే అందరూ వోదారుస్తారు. పద్దెనిమిది ఏళ్ళలేవు; నేను పాలిచ్చుకోడానికి ముద్దు చెయ్యడానికి, ఆడుకోడానికి పిల్లకావాలంటే ఎందుకు తిట్టడం? సిగ్గుమాలిన ముండ దీన్నింటో వుంచ

కూడ దంది వొదిన. బయటికనకూడదు. ఇట్లా రాత్రు లాలోచించాలి.... మళ్ళీ గస్తీ యీలలు. ఈ పోలీసువాళ్ళేట దొంగతనాలు చేయించేది.... ఒక్కపిల్ల వుంటేచాలు ఆడపిల్ల ఐనా సరే. వొద్దు వొద్దు ఆడపిల్ల వొద్దు. నాకు వెధవ ముండే పుడుతుంది. నాకుమల్లే యిట్లా యేడవాలి........నాకు నిద్ర వొస్తోంది. కాని యీ చలిలో యెట్లా నిద్రపడుతుంది? శాలువుంటే బావుండును. హాయిగా మంగమ్మ కప్పుకొని నిద్రపోతోంది. నేను మాత్ర మిట్లా ఎందుకని బాధపడాలో........మరి చేసుకున్న కర్మ ప్రకారం యిందరు ఆడవాళ్లు బిడ్డలులేకుండా ఇట్లాంటి విచారంతో చస్తోవుంటే, మొగవాళ్ళ కొక్కరికీ ఇట్లాంటి కర్మ పట్టదేం? పెళ్ళాం పోతే పెళ్ళాం తయారవుతుంది. అందరూ పాపాలు చేసేవారేగా! ఏదో మేముమాత్రం చేసే పాపం వొకటుండాలి. వెధవలయ్యే పాపం. మళ్ళీ యిక పెళ్ళిగాని పాపం. మళ్లీ తక్కిన వెధవలు చెయ్యరది. హిందూ విధవలే. మొన్న శాస్త్రిల్లుగారంటున్నారు. ఈ వ్రతాలూ, పూజలూ, యాత్రలూ చెయ్యడం వల్ల స్వర్గం వొస్తుందట. మరి ఆ స్వర్గంకోసం అందరూ వెధవముండలు కారాదూ? ఎక్కడో వెధవ ముండలకి మళ్ళీ పెళ్ళి చేస్తున్నారట! అప్పుడు మళ్ళీ జుట్టు పెంచుకుంటారా! వెధవముండల్ని చేసుకునే వాళ్ళెవ రుంటారో!

కర్మమెట్లానైతేనేం. నాకు పిల్లలు కావాలి. ఒకవేళ వెధవనై కూడా బిడ్డనికనే రాత వుందేమో! ఆ బిడ్డను ఈ జన్మంలో కని పెంచేపుణ్యమో, పాపమో పూర్వజన్మంలో చేశానేమో? అప్పుడు మరి వీళ్ళందరూ యేమం టారు? వొదిన చంపేస్తుంది. అన్నయ్య తరిమేస్తాడు. నా కర్మం ప్రకారం అట్లా రాసివుంది నేనేం చెయ్యనంటే,వొప్పుకుంటారా? నాకు ఆ పెనిమిటికే వివాహం కావాలనీ, ఆయన చావాలనీ, నేనిట్లా కావాలనీ, అన్నీ రాసివున్నా

యట. నేను పిల్లని కనాలనీ, రాసివుండకూడదూ? వీళ్ళు చూసి వొచ్చారా? ఇంక నామీద కోపమెందుకూ? తబ్బిందని ఆ రోగిష్టి మొగుణ్ణి కట్టడం నా కర్మం. బిడ్డని కంటే నన్ను వెళ్ళ కొట్టడం వీళ్ళ కర్మం. ఇట్లా ఆడవాళ్ళందరూ యీడవడం యీదేశం కర్మం. పోనీ జాలన్నా చూపించరు. యెవరన్నా వాళ్ళ పూర్వజన్మ దుష్కృతంకొద్దీ, గుడ్డివాళ్ళయితే, కుంటి వాళ్ళయితే, జాలిపడతారు. నాకు ఆ దుష్కృతం... కాదు....సుకృతం కొద్దీ బిడ్డపుడితే జాలిచూపరు. అట్లా రాసివుండంది నాకు మాత్రం బిడ్డ పుడుతుందా యేం? వెధవనైతేనే జాలిలేదే వీళ్ళకి పోనీ బిడ్డమీదనన్నా జాలి వుండదు. మళ్లీ జాలి కలవాళ్ళే; నాకుమాత్రం చూపరు. ఎందుకో!........ యీ యెలికలు నన్నుకూడా కరవ్వగదా; ఒక వేళ ఆ కిటికీలోంచి దొంగొస్తాడేమో....... మొన్న ఆవుపెయ్య యెంత కష్టపడ్డది! అదిచూసి వెంటనే యెద్దును తెప్పిచ్చారు. యెందుకూ! వీళ్లకి పాలూ దూడలూ కావాలికనక. మరి నాకు పిల్లలు కావాలి. కర్మం ప్రకారం మొగుడుపోయినాడు. కర్మాన్ని జయించి నేను ఆ సౌఖ్యం సంపాయిస్తా నంటే వీళ్ల కెందుకో కోపం!......వొదిన పుట్టింటి కెళ్ళినప్పుడు అన్నయ్య సుబ్రహ్మణ్యంగారితో అంటున్నాడు సిగ్గులేకుండా, భార్యలేకుండా,వంటరిగా వుండడం కష్టమని! నాకు కూడా అట్లానే వుందని పైకి అంటే ఆకాశం ముక్కలై కిందపడ్డట్టు చూస్తారు...... చలి యెక్కువౌతోంది. పొయ్యి కూడా చల్లబడ్డది... అందరూ అన్నంతింటారు. కొందరికి అన్నం తిన కుండావుండే కర్మం కాలదు. అట్లా కాలినవాళ్ళు, ఆ కర్మాన్ని జయించి అన్నం దొరికించుకొని తింటే, ఎవరూ ఏమీ అనరు. కాని కొందరికి యిట్లా కర్మం కాలుతుంది. ఈ బాధ వోర్చుకోవలసిందేగాని, తీర్చుకోవలసింది కాదు...... మృగాలకి ఇట్లాంటి కర్మంపట్టదు....అయ్యో! ఆవునో, కోడినో ఐ ఎందుకు పుట్టలేదో నేను; మళ్ళీ మనుష్యజన్మ గొప్పది అంటారు.

మనుష్యజన్మం గొప్పదేకాని వితంతుజన్మం కాదు. ఎవరూ ఒక్కరూ, హృదయం దగ్గిరిగా చేర్చుకోడానికి లేకపోయింతరవాత బతకడ మెందుకు! పిల్లలులేని వితంతుజన్మం ఏమవసరమో ఈశ్వరుడికి! ఏమిటోబాధ, ఆశ, కల—నాలోపల. మొగవాడివల్ల తీరుతుంది గావును! ఏమిటో శూన్యం, లోపం.

## 2

అయిందానికి విచారంలేదు. కాని కొంచెం భయంగా మాత్రం వుంది. భర్తేవుంటే, ఈపాటికి సూడిదలూ, ఉత్సవాలూ! ఇప్పుడు వెలి. అప్పుడు రహస్యంగా వొదిన చెవులో చెబితే, నవ్వి చెంపమీద కొట్టి వుండేది. ఇప్పుడు చెవి కాలినట్టు అదిరి పడుతుంది. అప్పుడూ యిప్పుడూ ఒకటేకదా! అసలు సృష్టి ఒకటే విధంకద! ఇప్పుడు ఒకసారి జరిగింది. అప్పుడు ఎప్పుడూ అదే-........లోపల కదులుతోంది. అప్పుడే తెలుసును గావును, నేను తన అమ్మనని. ఎప్పుడూ నన్ను లోపల లోపల తాకుతో వుంటుంది. ఆ పెద్దకళ్ళూ, చిన్నికాళ్ళూ పెద్దవవుతున్నాయి గావును- నాకు మంగమ్మ కూతురంటే చీకిరికళ్ళ పిల్ల పుడుతుందా? ఎప్పుడూ ముక్కు-కారుకుంటూ——మళ్ళీ మొగవాడి మొహం చూడను. వాడు నేను తనని వలిచే వొప్పుకున్నాననుకుని వుంటాడు? నా పుట్టబోయే బాబుకి వాడిపెద్ద కళ్ళు రావాలని వరేనన్నాను, నావంక యోధుడివలె. జయించిన వాడివలె చూస్తాడు దరిద్ర వెధవ- ఎలా మండుకొస్తుంది- వాడికిచ్చిన చనువుకి నాకు దోకువస్తుంది. తన వెధవ అందం చూసి నిలవలేక, భ్రమిసి, నా వొంటి మదంఅణుచుకోలేక భంగపడివాడికిప్రాధేయపడ్డాననుకున్నాడు. ఈసారిదగ్గిరికి రానీ మొహంమీద ఉమ్మేస్తాను. కాని పాపం, నాకీబిడ్డ నిచ్చినవాడే, నాబిడ్డ

తండ్రేలని మళ్ళీఎందుకో చెప్పరాని ప్రేమ కలుగుతుంది. అదిసహజమేమో! కాని ఆరాత్రి వాడికి నేను లోకువ కావడం అది తలుచుకుని భరించలేను· అప్పుడు ముద్దుగా, గౌరవంగానే మాట్లాడాడు. కాని వాడి కళ్ళలో ఎంతో చులకనయ్యే వుంటాను నేను. ఇట్లా నీచంగా ఏ మొగాడికో లోబడిగాని, వాడికి వొంటిని, పవిత్రమైన వొంటిని, వాడి మోటుచేతులకి వప్పచెప్పి, ఎట్లా వుపయోగించినా వూరుకుని—ఛీ! ఛీ! ఆ యెంగిలి ....పాడు....నలిగిపోయిగాని. కనడానికి, పుత్రభిక్షని పొందడానికి. వీల్లేక పోవడమేమిటో! ఛీ ఛీ! వెళ్ళిపోయేటప్పుడు వాడు, ఎంత లోకువగా మాట్లాడాడు! ఈ మొగాళ్ళు చూపే గౌరవం దొంగగౌరవమే! బతిమాలడం వాళ్ళకే బావుంటుంది గనక బతిమాలతారు. ఆట! కాని వాడి వూహ! నేను ప్రాధేయపడ్డాననేగా! అంతా నటన! ముందు 'నేనున్నానుగా? నేను రక్షిస్తాగా!' అని అవసరమేమీ లేకుండానే అని, నా భుజంమీద చెయ్యేసి, ఎవరో విరోధులున్నట్టు దిక్కరించి నుంచున్నాడయ్యా! తరవాత పాదాలు చప్పుడౌతున్నాయనేటప్పటికి, ఆషర్టు చంకనపెట్టి గుమ్మంలో నక్కాడు. అంతా మాయ. అట్లా ఆడదాన్ని రక్షిస్తున్నట్టుగా నుంచుంటే, వాళ్ళ మనసుకి శాంతిగా వుంటుంది. నా ధైర్యంలో యిరవయ్యో వంతులేదు. వాడు వెడుతో, 'భయం లేమలే' అంటాడు పైగా. చిరునవ్వుతో, వెకిలిగా "జాగర్త, ఆ వెంకటేశ్వర్లుకూడా కన్నేశాడు. వాడివేపు చూశావా, చంపేస్తా. వాణ్ణీ నిన్నూ!" ఒకరాత్రి, ఒక్క అరగంట వాడికి లోకువైనానని, నాపైన అంత అధికారమూ, స్వతంత్రమూ వొచ్చాయి వాడికి! ఛీ పాడుజన్మ! ఈ ఆడజన్మ!...... నిజంగా యింక నాకు బిడ్డపుట్టి తీరుతుందికదూ! ఆ చిన్న గులాబి గుప్పెట్లు పట్టుకుని చిన్న చిన్న కళ్ళు మూసుకుని, పగడంవంటి నోటితో, పాలకి తడుముకొంటో, యూ, యూ, అంటూ....అమ్మోయ్!

పీళ్ళెప్పుడో ఒకప్పుడు తెలుస్తుంది ఎన్నాళ్ళు దాచగలను యిట్లా? పోయిన నెలకూడా, బయటకూచొని, నాటకమాడాను....వొదిన కొడుతుంది. ఏమైనాసరే బయట తెలియకూడదంటాడు అన్నయ్య. వొదిన వెళ్ళకొట్టి పంటుంది. అన్నయ్య వొద్దంటాడు. కాని కేకలు వేసే వొదినే నయం. అ రహస్యంగా వుంచమనడం నాకోసమా? కులం వెలిపడి నా అనేవాళ్ళులేక, నా మొహంమీద వుమ్మి వేయించుకొంటో, వొంటరినై, భ్రష్టురాలనయ్యే నా సంగతి అఖ్ఖర్లేదు: ఏపాపం ఎరక్క నిర్భాగ్యురాలికి, నాకు పుట్టే దిక్కుమాలిన, నా పిల్లల సంగతీ ఆలోచించడు. యిరుగు పొరుగునా కచేరీలోనూ తన చెల్లెలిట్లా చేసిందంటే, తన పరువు పోయిందనే దిగు లొక్కటే అతనికి—మళ్ళీ చిన్నప్పుడు అన్నయ్య బళ్ళోంచి వస్తాడని, నా కాఫీకూడా అతని గ్లాసులోనేపోసి, అంతా అతనికే వేడిచేసి యిచ్చే దాన్ని. లస్టరుచిమ్నీ, తన బంతితో అన్నయ్య బద్దలుకొడితే, నేనని ఆ నేరం నామీద పెట్టుకుని, దెబ్బలన్నీ నేను తిన్నాను. ఆవాళ రాత్రి నా బుజాల మీద చేతులేసి, "చెల్లీ ఎప్పుడూ మరిచిపోను. ఇంకెప్పుడూ నిన్ను కొట్ట" నన్నాడు. ఆవేళ నాకెంత సంతోషం వచ్చిందని! ఇప్పుడు అన్నయ్య దయగా ఒకమాట మాట్లాడడు....

నాకు చచ్చిపోయిన తరవాత నరకం అంటకుండాను నా శరీరాన్ని ఇంత అందంగాచేసి, రగిలే ఈ కోర్కెని హృదయంలో సహజంగా పుట్టించి, నాకు పెళ్ళిచ్చిన మొగుణ్ణి చంపి, పైగా నన్ను నరకానికి పంపు తాడా దేవుడు! మంగమ్మకి కొడుకుపుట్టినందుకు స్వర్గమా! పిల్లల్ని కొట్టే మంగమ్మకి! లేకలేక కష్టపడి ఈ బిడ్డను తెచ్చుకొని కన్నందుకు నరకమా! అ దేవుణ్ణి అడగనూ నాటకానికన్నా వెళ్ళనీకండా, ప్రతి రాత్రీ అన్నయ్యని

తనకి కట్టేసుకునే పడినకుండదూ, నరకం! అంతా అబద్ధం. దేవుడికిలేదు నామీదకోపం. నన్ను భయపెట్టడానికి అన్నారు. అప్పుడే మా చిన్ననాన్న బొజ్జలోకి పాలు ఏర్పడుతున్నాయి. దేవుడికే కోపంవుంటే అబ్బాయి పుడతాడని ముందే యోచించి ఆ బంగారు బొజ్జలోకి బువ్వ తయారు చేస్తాడా! అంతా అబద్ధం. వీళ్ళకి తెలియకపోతే దేవుడికి తెలీదూ నాబాధా, నా స్వభావమూ, ఆలోచనా!—నేనే కావలసినవారు, నన్నే ప్రేమించేవారు, నన్ను బతిమాలి గోముచేసి "యెంతకోపం నామీద" అని గడ్డంపట్టి తమవేపు తిప్పుకునేవారు వుండాలని ఎంతో మనసు లాగుతుంది. ఏ మొగాడు ఏ ఆడదాన్ని ప్రేమగా చూచినా, ఆపాదమస్తకం మండిపోతుంది! నన్నో! నన్నో! నాకో! నాకో! అని ప్రతి నరం అరుస్తుంది. నామీద ప్రేమలేనివాళ్ళకి, జన్మమంతా రెక్కలకష్టం పోసి ముసలిదాన్నై చస్తే ఎవరు సంతోషించను? అంతకంటే నన్ను ఒక్కరాత్రికైనా సరే కావాలనేవాడికి నా దేహమిచ్చుకుంటే పాపమా! సోమరిమల్లే పగలు తొమ్మిదింటిదాకా పట్టెమంచంమీద దొర్లే వాడినకి కాఫీకాచడం పుణ్యమని ఏశాస్త్రాల్లో వ్రాసి వుందో! ఇల్లాంటి కోరికలు, ఇంతమంది వితంతువులు వున్నారే, వాళ్ళందరికీ వుంటాయా? వాళ్ళెవరూ నాకుమల్లే గోలపెట్టినట్టు కనపడరే? వాళ్ళు మంచి వాళ్ళేమో! నాకొక్కదానికేనేమో యీ దుర్బుద్ధి! కాదు. నేనూ పైకి ఏ మెరగనట్లే కనపడతాననుకుంటా. బైటికందరూ అంతే! లోపల....ఎవరినన్నా రహస్యంగా అడగనా? అడిగితే, ఛీ ఛీ, పొమ్మంటారు! నేననను? అట్లానే తమాషా. నేనుమాత్రం అందరంత మంచిదాన్ని కానాయేమిటి? రోజూ జపంచేస్తాను. వాళ్ల బుల్లెమ్మ మల్లే తాంబూలాలు వేస్తానా? పరుపులమీద పడుకుంటానా? బ్రాహ్మడికి ప్రతినెలా పెట్టుకుంటున్నాను. మొన్న స్వాముల వారి తీర్థం పుచ్చుకున్నాను. నాకుమాత్రం భర్తే వుంటే నేను మంచిదాన్ని

కాదూ? అప్పుడు యీ పని వొద్దనడం. పిల్లల్ని కనకపోవడం, తప్పు, అపరాధం. పన్నెండేళ్ళు నిండకముందే మొదలుపెట్టి అరవై య్యో. యేటి దాకా, ఒక రోజూ వ్యవధిలేకుండా కాపరాలు చేసే యీ ముత్తైదలని చూస్తే యెవరికీ విపరీతంగా కనపడదేం? భర్తపోగానే కోర్కెకూడా చస్తుందా వాడితోకూడా? వాడిచితిమీద కాలుతుందా?.... ఎవరినన్నా కన్నెత్తి చూస్తే చాలు; ఇల్లంతా తల్లకిందులుచేసి రాగాలుపెట్టి, పరాయి ఆడదాన్ని గడప తొక్కకుండాచేసి, తమ మొగాళ్ళని తమ వుపయోగార్థమే వాడుకుంటారే! ఎన్నడూ మొగాణ్ణి యెరగని దానికి నాకు మాత్రం అట్లా వుండదూ?

నా సంగతి తెలిస్తే వీళ్ళూరుకోరు. కాని నన్నింటోంచి బైటికీ పోనీరు. నా బిడ్డని యెవరికో ఇప్పించి మళ్ళీ నన్ను చాకిరీకి తెచ్చుకుంటారు. నేనెక్కడన్నా నా బాబుతో సుఖంగా బతుకుతున్నా వీళ్ళు వోర్చుకోరు తమదైన హక్కును తమకి భుక్తమైన సొంత సౌఖ్యాన్ని నేను దొంగి లించినట్టు ఏడుస్తారు. సూర్యనారాయణ చెల్లెలిని నలుగురూ నన్నూ నా బిడ్డతో సహా చూపిస్తోంటే, అన్నయ్య సహించగలడా?

కాని, నేనొప్పుకోను, నా బాబుని, నా చిట్టి బంగారాన్ని ఎవరికీ ఇవ్వను. నాకు తప్ప వాడిమీద ఎవరికి వుంటుంది దయ! మామయ్యలూ అత్తయ్యలూ, తాతయ్యలూ వీళ్ళకి వుండదే కనికరం! పరాయి వాళ్లకి వుంటుందా? నే నివ్వనీను. నేనే పెంచుకుంటా. నన్ను వీళ్ళేం చేసినాసరే. గోలచేస్తా, యేడుస్తా. వెళ్ళిపోతా. కాని, నా బాబుని లేకలేక నా చేతుల్లోకి వొచ్చిన నా భాగ్యాన్ని పారేసుకోను, నా ముద్దులమూట చిరునవ్వొక్కటి చూడకుండా వుంటానా? నేను స్వతంగా పాలిచ్చుకుంటా నాబాబు నన్ను గుర్తుపడితే ఇన్ని కష్టాలు, వెలీ, తిట్లూ, అన్నీ తనకోసమే, అని తెలుసు కుంటే, నన్నూ, నా మొహాన్నీ, గుర్తుపట్టి, చేతులు జాచి, నావేపు "అమ్మా"

అంటే, పకపక రత్నాలు నవ్వితే, నామీదే అంత ప్రేమా చూపితే నాకింకేం కావాలి?—వీళ్లకి నా బిడ్డమీద కూడా కోపం ఎందుకొస్తుందో? నేనంటే పోనీ అపరాధం చేశాననుకోవచ్చు. నోరెరగని ఆ పసిగుడ్డేంచేసింది? ఒకవేళ నన్ను వాళ్లల్లో వుణ్ణిచ్చినా వుంటానా! వాడిముందు నన్ను లోకువగా చూస్తే నేను భరించగలనా? వాణ్ణి తిట్టి, వాడిచేత చాకిరీ చేయించుకుంటే—ఎక్కడికన్నా వెళ్ళిపోతా—యెక్కడికో. నాన్న అంటే ఏమననూ? వచ్చి పోయినాడంటా. కాదు.... "నేవే నీనాన్న" అంటా.

*